**Hazrath Imam Hussain (RA)**
(Telugu)

# హజ్రత్ ఇమామ్ హుసైన్
రజిఅల్లాహు అన్హు

రచన

**మౌలానా సయ్యద్ అబుల్ ఆలా మౌదూది (రహ్మలై)**

అనువాదం

**యం.డి. ఉస్మాన్ ఖాన్**

అనంతకరుణామయుడు అపారకృపాశీలుడైన అల్లాహ్ పేరుతో

# హజ్రత్ ఇమామ్ హుసైన్
## రజిఅల్లాహు అన్హు

ప్రతి ఏడూ కోట్లాదిమంది షియా, సున్నీ ముస్లింలు హజ్రత్ ఇమామ్ హుసైన్ (రజి) చేసిన త్యాగానికి నివాళులర్పిస్తూ, ఆయన అమరగతి పట్ల తమ ప్రగాఢ సంతాపం వ్యక్తపరుస్తుంటారు. కాని ఇమామ్ హుసైన్ (రజి) ఏ లక్ష్యం కోసం తన ప్రాణాన్నేకాకుండా, తన, తన పరివారం ప్రాణాలను కూడా పణంగా పెట్టారో ఆ లక్ష్యాన్ని అనేకమంది గుర్తించకపోవడం విచార కరం.

ఒక పీడితుని అమరగతి పట్ల అతని కుటుంబానికి సంతాపం, సాను భూతులు ప్రకటించేవారు తమ బాధను, దుఃఖాన్ని వ్యక్తం చేయడం సహజమే. ఇలాంటి బాధను అతనితో సంబంధమున్న ప్రతి కుటుంబం వ్యక్తం చేస్తుంది. అతని మరణం పట్ల అతని బంధుమిత్రుల నుండి ప్రేమ, సాను భూతులు వ్యక్తం కావడం సాధారణ విషయమే. అందులో ప్రత్యేకత ఏమీ లేదు. మరి ఇమామ్ హుసైన్ (రజి)లో ఉన్న ప్రత్యేకత ఏమిటి? పద్నాలుగు వందల సంవత్సరాలు గడిచిపోయినా ప్రతి సంవత్సరం ఆ మహనీయుని అమరగతి పట్ల కోట్లాదిమంది ప్రజలు విచారం వ్యక్తపరుస్తున్నారంటే ఆయన అమరగతి వెనుక ఒక మహోన్నత లక్ష్యం ఉండి తీరాలి. ఏ లక్ష్యం లేకుండా ఒక మనిషి చేసిన ప్రాణత్యాగం పట్ల కోట్లాది జనం ప్రతి ఏడూ ఇలా సంతాపం, విచారం వ్యక్తపరచడంలో అర్థం లేదు. స్వయంగా ఇమాం దృష్టిలో కూడా ఇలాంటి వ్యక్తిగత ప్రేమకు, త్యాగానికి ఏమాత్రం విలువ లేదు. ఒకవేళ ఆ మహనీయు

నికి, తన కుటుంబమే తన 'లక్ష్యం' కన్నా ప్రీతికరమైనవయితే ఆయనకు తన నిండు ప్రాణాలను త్యాగం చేయాల్సిన అవసరమే ఉండేది కాదు. ఆయన దృష్టిలో అన్నిటికన్నా లక్ష్యమే గొప్పదనడానికి ఆయన ప్రాణ త్యాగమే ప్రబల నిదర్శనం.

కాని ఈనాడు ముస్లింలు ఏ లక్ష్యం కోసం ఆ మహనీయుడు ప్రాణ త్యాగం చేశారో, ఆ లక్ష్యం కోసం ఏమీ చేయకపోగా, దానికి వ్యతిరేకంగా పని చేస్తూ, కేవలం ఆయనపట్ల వ్యక్తిగత ప్రేమను వ్యక్తం చేస్తూ, ఆయన కోసం రోదిస్తూ, ఆయన ప్రత్యర్థులను తిట్టిపోస్తున్నారు. దీనివల్ల ప్రళయదినాన వారు ఆయన అభిమానాన్ని పొందలేరు. దేవుడు కూడా వారి విచారాన్ని, ఆక్రోశాన్ని గుర్తించడు. వీటికేమాత్రం విలువనూ ఇవ్వడు.

ఇంతకూ ఆ మహనీయుని లక్ష్యం ఏమిటి? స్వలాభం కోసమో, అధికార పీఠం కోసమో ఆయన ఇంతటి త్యాగాలకు పూనుకున్నాడా? ఇమామ్ హుసైన్ గురించి, ఆయన కుటుంబ చరిత్ర గురించి తెలిసినవారు ఇలాంటి అనుమానాలు వ్యక్తం చేయలేరు. ఇమాం కుటుంబీకులు తమ స్వలాభం కోసం ముస్లింల రక్తం పారించారని ఎవరూ అనలేరు. ఒకవేళ ఈ కుటుంబం రాజ్యాధికారంపై తన వ్యక్తిగత పట్టుసడలకుండా ఉండడం కోసం ఇలా చేసిందని కాసేపు మనం అనుకున్నా, సత్యప్రేమికులైన ఆనాటి ముస్లింలు అధికారం కోసం అర్రులు చాచే, రక్తం పారించే వైఖరి ఏమాత్రం అవలంబించ లేదని హజ్రత్ అబూబకర్ (రజి) మొదలు హజ్రత్ ముఆవియా (రజి) వరకు యాభయి ఏళ్ళ చరిత్ర సాక్ష్యమిస్తోంది. ఆనాడు ముస్లిం సమాజంలో సంభ విస్తుండిన మార్పుల దృష్ట్యా, ఇస్లామీయ రాజకీయ వ్యవస్థకు ఆత్మ లాంటి ప్రజాస్వామ్య వ్యవస్థ బీటలువారుతున్నప్పుడు దాని పరిరక్షణకు కృషి చేయడం, పోరాడడం ధర్మసమ్మతమేకాకుండా, దాన్ని తన విధిగా భావించారు ఇమాం హుసైన్ (రజి).

## ప్రభుత్వ వైఖరి, లక్ష్యం, చట్టవ్యవహారాలలో మార్పు

ఆ మార్పులు, తారుమారు పరిస్థితులు ఏమై ఉంటాయి? ప్రజలు తమ ధర్మాన్ని మార్చుకున్నారా? లేదే. పాలకులతోసహా ప్రజలందరూ దేవుణ్ణి, దైవ ప్రవక్తను, దైవగ్రంథాన్ని అంతకుముందులాగానే విశ్వసిస్తున్నారు, తదను గుణంగా ఆచరిస్తున్నారు. ఆనాడు దేశ రాజ్యాంగం కూడా మారలేదు, న్యాయస్థానాల్లో కూడా ఖుర్‌ఆన్, సున్నత్‌ల ప్రకారమే బనూఉమయ్యా పాలనలో తీర్పులు జరిగినట్లే అప్పుడూ జరుగుతూ ఉండేవి. క్రీ.శ పందొమ్మిదో శతాబ్దానికి ముందు ప్రపంచంలోని ఏ ముస్లింపాలనలో కూడా చట్టాల మార్పులు జరగలేదు. ఒక యజీద్ తన కుయుక్తుల ద్వారా రాజ్యాధికారాన్ని హస్తగతం చేసుకున్న కారణంగా దాన్ని ఎదుర్కోవడానికి ఇమామ్ హుసైన్ నడుం కట్టారని భావించి కొంతమంది యజీద్ వ్యక్తిగత జీవితాన్ని భూతద్దంలో చూపించారు. దానివల్ల ప్రజల్లో ఒక రకమైన తప్పుడు భావన ఏర్పడింది. యజీద్ వ్యక్తిత్వం, అతడి జీవితచరిత్ర ఎంత చెడ్డదైనప్పటికీ రాజ్యవ్యవస్థ సరైన పునాదులపై స్థిరంగా ఉన్నప్పుడు, కేవలం ఒక దుర్మార్గుడు అధికారాన్ని హస్తగతం చేసుకున్నాడన్న కారణంగా ఇమామె హుసైన్ లాంటి మేధావి, ధర్మశాస్త్ర పారంగతుడు అంతటి ఆగ్రహం, అసహనాలకు గురవు తాడా? ఇమాం అసహనానికి కారణం యజీద్ వ్యక్తిగత వ్యవహారం కాదు. చరిత్రను లోతుగా అధ్యయనం చేస్తే వాస్తవం స్పష్టమవుతుంది. యజీద్ పాలన, అతడి అధికార హస్తగతం వల్ల దేశంలో ఏ చెడులైతే చోటు చేసుకో సాగాయో, అవి ఇస్లామీయ సంక్షేమ రాజ్య చట్టాలను, దాని లక్ష్యాలను తారుమారు చేసేవిగా ఉండేవి. ఈ మార్పులవల్ల సంభవించే దుష్ఫలితాలు వెంటనే బహిర్గతం కాకపోయినా ఒక మేధావి, దూరదృష్టికల మనిషి తాను ప్రయాణిస్తున్న దిశను బట్టే మున్ముందు జరగబోయే ప్రమాదాన్ని పసిగట్టగలడు. ఇలాంటి ప్రమాదాన్నే పసిగట్టిన ఇమాం హుసైన్ (రజి) బండిని తిరిగి గాడిలో పెట్ట డానికి, ఆ ప్రమాదాన్నుండి ప్రజలను కాపాడడానికి తన ప్రాణాలను సైతం పణంగా పెట్టే నిర్ణయం తీసుకున్నారు.

## అతిక్రమణ బిందువు

ఈ విషయాన్ని సరిగ్గా అర్థం చేసుకోవాలంటే మనం దైవప్రవక్త ముహమ్మద్ (సఅసం), ఖులఫాయె రాషిదీన్‌ల నాయకత్వంలో నలభయ్యేళ్ళ పాటు నిరాటంకంగా సాగిన రాజ్యవ్యవస్థ తీరును పరిశీలించాలి. దాని చట్టాల మౌలిక ప్రాధాన్యతలేమిటో అర్థం చేసుకోవాలి. యజీద్ రాచరికంతో ముస్లిం సమాజంలో, ఇస్లామీయ రాజ్యవ్యవస్థలో ఏఏ చెడులు తొంగిచూశాయో అవి బనీఉమయ్యా, బనీఅబ్బాస్‌ల పాలనలో, ఆ తరువాతి చక్రవర్తుల పాలనలో బహిర్గతమయ్యాయి. ఈ వాస్తవాన్ని గమనిస్తే ఇస్లామీయ ప్రజాస్వామ్య వ్యవస్థ మొదట్లో ఏమార్గంపై నడిచేదో, ఆ తరువాత ఏవిధంగా దారి తప్పిందో మనకు అర్థమవుతుంది. అదేవిధంగా దైవప్రవక్త ముహమ్మద్(సఅసం), హజ్రత్ ఫాతిమా (రజి), హజ్రత్ అలీ (రజి) గార్ల చల్లని ఒడిలో శిక్షణ పొందిన వ్యక్తి, దైవప్రవక్త ప్రియసహచరుల (సహబీల) సుందర సమాజంలో బాల్యం నుండి వృద్ధాప్యం వరకు జీవితం గడిపిన మహనీయుడు, ఇస్లామీయ ప్రజాస్వామ్య రథం అతిక్రమణ బిందువును దాటి అపమార్గం పడుతున్నప్పుడు, దాన్ని అడ్డుకోడానికి ఎందుకు ప్రయత్నించాడో, ఆ రథాన్ని సరైన దారికి మళ్ళించ డానికి దానిముందు నిలబడితే ఎదురయ్యే పర్యవసానాన్ని కూడా ఆ మనిషి ఎందుకు ఖాతరు చెయ్యలేదో కూడా చరిత్ర అధ్యయనం ద్వారా మనం గ్రహించగలం.

## మానవ రాచరికం ప్రారంభం

'దేశం దేవునిది, దేశవాసులు దేవుని పాలితులు' అనేది ఇస్లామీయ పాలనలో ప్రప్రథమ మౌలిక సూత్రం. ఆనాడు ఇస్లామీయ రాజ్యంలో కేవలం నోటిమాటగానే కాకుండా ఆచరణాత్మకంగా కూడా పూర్తి విశ్వాసంతో ఈ విషయం నిరూపితమయ్యేది. ప్రజలు దేవుని పాలితులు, ప్రభుత్వాలు, పాల

కులు ప్రజల విషయంలో దైవానికి జవాబుదారులు. అంతేకాని పాలకులు పాలితుల ప్రభువులు ఎంతమాత్రం కాదు. ప్రజలు పాలకుల బానిసలు కూడా కాదు. ఇస్లామీయ ప్రజాస్వామ్యంలో ప్రజలే ప్రభువులు, పాలకులు, సేవకులు. పాలకులు దైవదాస్యాన్ని తమ కంఠహారంగా స్వీకరించి, దైవదాసులైన ప్రజలపై దైవశాసనాలను అమలు పరచాలి. ఇదే వారు మొట్టమొదట చేయవలసిన పని.

కాని, యజీద్ రాచరికంతో ముస్లింలలో ప్రారంభమైన మానవ సార్వభౌమత్వం దేవుని సార్వభౌమత్వాన్ని అణచేసి దాన్ని నామమాత్రంగా ఉంచింది. పూర్వం మానవ సార్వభౌములు ఏ విధానాలను అనుసరించారో వారూ అదే విధానాన్ని అనుసరించారు. అంటే, రాజ్యం రాజుది, రాజవంశానిది. ప్రజల ధన మాన ప్రాణాలపై రాజుకు, రాజవంశానికి సంపూర్ణహక్కులు, అధికారాలు ఉండేవి. ఒకవేళ కాస్తో కూస్తో దైవచట్టాలు అమలయినా అవి ప్రజలకు మాత్రమే పరిమితమయ్యేవి. రాజు, రాజవంశీయులు, అధికారులు, నాయకులు దైవచట్టాలకు అతీతులుగా భావించబడేవారు.

## మంచిని పెంచడం, చెడును తుంచడం పట్ల నిర్లక్ష్యం

దేవుని భూమిపై ఆయనకు ఇష్టమైన మంచిని పెంచడం, ఆయనకు అయిష్టమైన చెడులను నిర్మూలించడం ఇస్లామీయ రాజ్య ప్రప్రథమ కర్తవ్యం, దాని ప్రధానలక్ష్యం. కాని మానవ సార్వభౌమత్వాన్ని అంగీకరించిన రాజ్యలక్ష్యం మాత్రం పాలకులు రాజ్యాలను జయించడం, వాటిని విస్తరించుకోవడం, పన్నుల ద్వారా విలాసవంతమైన జీవితం గడపడం తప్ప మరేమీ కాలేకపోయింది. దైవనామాన్ని, దైవ ధర్మాన్ని విస్తరించే సేవ అతికొద్ది మంది రాజులు మాత్రమే చేసి ఉంటారు. వారు, వారి అధికార యంత్రాంగం ద్వారా మంచి తక్కువగా, చెడే ఎక్కువగా ప్రబలింది. మంచిని పెంచడానికి, చెడును రూపుమాపడానికి, సచ్ఛీల సాహిత్య ప్రచురణకు, పరిశోధనకు కృషిచేసిన వారికి

ప్రభుత్వ సహకారం మాట అటుంచి, వారెప్పుడూ ప్రభుత్వ ఆగ్రహానికే గురయ్యేవారు. ఎంతటి వ్యతిరేకత ఎదురైనా, ఎన్ని అడ్డంకులెదురొచ్చినా కొంతమంది దైవదాసులు తమ శక్తిమేరకు తమపని తాము చేస్తూనే పోయారు. వారి ప్రయత్నాలకు భిన్నంగా ప్రభుత్వాలు, పాలకులు, అధికారులు, వారి సంబంధీకుల జీవితాలు, వారి పాలసీల ప్రభావం ముస్లిం సమాజాన్ని క్రమంగా నైతిక పతనం వైపుగొనిపోతూనే ఉండింది. చివరికి వారు తమ స్వలాభం కోసం ఇస్లాం సందేశవ్యాప్తిలో అవరోధాలు సృష్టించడానికి కూడా వెనుకాడలేదు. బనూ ఉమయ్యా పాలనలో కొత్తగా దైవధర్మాన్ని స్వీకరించిన నవముస్లింలపై జజ్‌యా విధించడమే దీనికి ప్రబల నిదర్శనం.

ఇస్లామీ రాజ్యానికి దైవభీతి, సచ్ఛీలత, జవాబుదారీతనం, వాగ్దాన పాలన మొదలైన సద్గుణసంపత్తి ప్రాణంలాంటిది. రాజ్యపాలకుడు ఈ సద్గుణాలకు ప్రతిరూపంగా, ప్రజలకు ఆదర్శంగా ఉండేవాడు. ప్రభుత్వాధి కారులు, న్యాయమూర్తులు, సేనాపతులు అందరూ ఎంతో నీతిమంతులుగా ఉండేవారు. ఈ సుగుణసంపత్తి ద్వారా వారు మొత్తం సమాజాన్ని ప్రభావితం చేసేవారు. కాని ఇస్లామీయ ప్రజాస్వామ్య విధానాన్ని వదిలేసి, రాచరిక విధానాన్ని అవలంబించగానే ముస్లిం పాలకులు ఖైసర్, కిస్రాల్లాంటి రీవి దర్పం, పటాటోపాలను అవలంబించడం ప్రారంభించారు. ఫలితంగా నీతి, న్యాయాల స్థానంలో అవినీతి, అన్యాయాలు తిష్టవేశాయి. దైవభీతి, పాప భీతుల స్థానాన్ని అహంకారం, తలబిరుసుతనాలు ఆక్రమించాయి. విశృంఖ లత, పైశాచికత్వం, భోగలాలస సర్వసాధారణమయ్యాయి. న్యాయం-అన్యాయం, ధర్మాధర్మాల విచక్షణాజ్ఞానం పాలకుల్లో నశించిపోయింది. రాజ కీయాల్లో నైతిక విలువలకు స్థానం లేకుండా పోయింది. పాలకులు దైవానికి భయపడే బదులు తామే భయంకరులుగా మారి దైవదాసులైన ప్రజల్ని భయపెట్టడం ప్రారంభించారు. ప్రజల్లో దైవవిశ్వాసాన్ని జాగృతం చేసే బదులు, ప్రజలు తమ దయాదాక్షిణ్యాల మీద ఆధారపడేలా చేశారు.

## ఇస్లామీయ చట్టం మౌలిక సూత్రాలు

ఇదీ స్థూలంగా లక్ష్యాల్లో, ఉద్దేశ్యాల్లో, వైఖరుల్లో, సిద్ధాంతాల్లో ఉన్న స్పష్టమైన సైద్ధాంతిక వైరుధ్యం. ఇలాంటి సైద్ధాంతిక వైరుధ్యమే ఇస్లామీయ చట్టంలోని మౌలిక సూత్రాల్లో కూడా గోచరించింది. ఇస్లామీయ చట్టంలో ఉన్న ఏడు మౌలిక సూత్రాలను కూడా సమూలంగా మార్చివేయడం జరిగింది.

**1) స్వేచ్ఛాయుత ఎన్నిక:** ఇస్లామీయ చట్టం ప్రకారం, స్వేచ్ఛాయుత వాతావరణంలో, ప్రజల అభీష్టం, అభిమతం మేరకు ప్రభుత్వం ఏర్పడాలి. పద్ధతికి వ్యతిరేకంగా మరెలాంటి పద్ధతి ద్వారానైనా ప్రభుత్వాధికారాన్ని హస్తగతం చేసుకోకూడదు. ప్రజలు తమ అభీష్టం ప్రకారం సలహాసంప్రదింపులతో అందరిలో ఉత్తముడయిన వ్యక్తిని ఎన్నుకొని అతడికి అధికారం అప్పగించాలి. అయితే ప్రజాభిప్రాయన్ని కూడగట్టుకోడానికి ఎలాంటి కుట్రలకు, కుయుక్తులకు పాల్పడరాదు. ప్రజలు తమ ప్రతినిధిని ఎన్ను కోవడంలో పూర్తిగా స్వతంత్రులయి ఉండాలి. ప్రజాభిప్రాయం తమకు అనుకూలంగా రానంత వరకూ ఎవరూ అధికారం కోసం ప్రయత్నించరాదు. ప్రజల విశ్వాసాన్ని కోల్పోయినవారు అధికారాన్ని అంటిపెట్టుకొని ఉండడానికి అర్హులు కారు. ఖులఫాయె రాషిదీన్‌లందరూ ఈ సూత్రాల ప్రకారం అధికారంలోకి వచ్చినవారే. అమీర్ ముఆవియా విషయంలో మాత్రం పరిస్థితి అనుమానస్పదంగా మారిపోయింది. అందుకే ఆయన సహాబీ అయినప్పటికీ ఆయన్ను ఖులఫాయె రాషిదీన్‌ల జాబితాలో చేర్చడం జరగలేదు. చివరికి యజీద్ రాచరికం రూపంలో పురుడు పోసుకున్న దుష్పరిణామాలు ఇస్లామీయ ప్రజాస్వామ్య సూత్రాలను ఛిన్నాభిన్నం చేసివేశాయి. ఈ విధంగా కుటుంబ పాలన, చక్రవర్తుల పరంపర ప్రారంభమైంది. ఈ దురదృష్టకర పరిణామాల వల్ల ఈనాటి వరకూ ముస్లింలు ప్రజాస్వామ్య ఎన్నిక విధానానికే నోచుకోలేకపోయారు. ఇప్పుడిక పాలకులు ప్రజల స్వేచ్ఛాభిప్రాయాలు, వారి అభీష్టం, సలహాల ప్రకారం కాకుండా అంగ

బలం, అర్థబలంతో అధికారాన్ని కైవశం చేసుకుంటున్నారు. ప్రజాభిప్రాయంతో అధికారాన్ని అందుకొనే బదులు, అధికారంతో ప్రజాభిప్రాయాన్ని తమకు అనుకూలంగా మలచుకోవడం ప్రారంభించారు. ఈ విధంగా ప్రజలకు ఇష్ట మున్నా లేకున్నా తమ అధికారాన్ని బలవంతంగానైనా వారిపై రుద్దసాగారు. మన్సూర్ అబ్బాసీ పాలనాకాలంలో, ఇలాంటి బలవంతపు పాలనకు వ్యతి రేకంగా గళం విప్పి, దాని అంతంకోసం ప్రయత్నించిన నేరానికి ఇమాం మాలిక్ (రహ్మ) గార్ని కొరడాలతో కొట్టి, ఆయన పెడరెక్కలు విరిచి బంధించడం జరిగింది.

**2) సలహామండలి వ్యవస్థ:** ఇస్లామీయ ప్రజాస్వామ్య చట్టంలోని మరో ముఖ్యసూత్రం ఏమిటంటే, పరిపాలన సలహాసంప్రదింపుల ప్రకారం సాగాలి. ఈ సలహాలు కూడా ప్రజల విశ్వాసాన్ని చూరగొన్న సచ్ఛీలురు, దైవభీతిపరుల నుండి తీసుకోవాలి. వీరి విశ్వసనీయతను బట్టి సాధారణ జనం వారి మాటను విశ్వసించేవారుగా, వారి మాటకు విలువనిచ్చేవారుగా ఉండాలి. ఖుల్ఫాయె రాషిదీన్‌లయిన హజ్రత్ అబూబకర్ (రజి), హజ్రత్ ఉమర్ (రజి), హజ్రత్ ఉస్మాన్ (రజి), హజ్రత్ అలీ (రజి)ల పాలనా కాలంలో సలహామండలి సభ్యు లుగా నియమించబడేవారిని నేరుగా ప్రజలు ఎన్నుకోకపోయినప్పటికీ, ఈనాటి ఆధునిక పరిభాషలో వారు నామినేటెడ్ సభ్యులే అయినప్పటికీ ఆనాటి పాలకులు వారిని తమకు అనుకూలంగా వ్యవహరిస్తారనో, తమ స్వలాభాలకు అడ్డుపడకుండా విధేయులుగా ఉంటారనో నామినేట్ చేయ లేదు. స్వలాభాలకు, బంధుప్రీతికి, ఆశ్రిత పక్షపాతానికి అతీతంగా, కేవలం ప్రజా సంక్షేమం కోసం జాతి ఆణిముత్యాలను ఎంపిక చేసేవారు. ఈ సభ్యులు అత్యంత సత్యసంధులు, ఆడితప్పనివారు, వాగ్దాన పాలకులు, ప్రతి విష యంలో వారు తమ జ్ఞానం, వివేచనల మేరకు ప్రభుత్వానికి విశ్వస నీయతతో కూడిన చక్కని సలహాలు ఇచ్చేవారు. సామాన్య ప్రజలందరికీ వారి పట్ల పూర్తి విశ్వాసం ఉండేది. వారు ప్రభుత్వానికి ఎలాంటి సలహాలనిస్తారోననే రవ్వంత అనుమానం కూడా వారికి ఉండేదికాదు. ఒకవేళ ఆరోజుల్లో ఈనాటి మాదిరి

ఎన్నికల విధానం ఉన్నా కూడా ప్రజలు దైవభీతికి, విశ్వసనీయతకే ఓటు వేసేవారు. కాని రాచరిక వ్యవస్థ పరంపర ప్రారంభం కాగానే సలహా మండలి వ్యవస్థను రద్దు చేయడం జరిగింది. ఆ తర్వాత రాజులు (చక్రవర్తులు) నియంతలుగా, సార్వభౌమాధికారులుగా పరిపాలించసాగారు. యువరాజులు, భట్రాజులు, గవర్నర్లు, సైనికాధికారులు, తమ అడుగులకు మడుగులొత్తే దర్బారీలు వీరి కౌన్సిళ్ళలో సభ్యులయ్యేవారు. ఒకవేళ ఈ సభ్యుల విషయంలో ప్రజాభిప్రాయ సేకరణ గనక జరిపితే, వారికి అనుకూలంగా ఒక్క ఓటొస్తే వ్యతిరేకంగా వెయ్యి ఓట్లు పోలవుతాయి. దీనికి భిన్నంగా ప్రజాభిమానం, ప్రజా విశ్వాసం చూరగొన్న సత్యసంధులు, దైవభీతిపరులైన సద్గుణ సంపన్నులకు ఈ చక్రవర్తుల దృష్టిలో ఏమాత్రం విలువ లేకుండా పోయేది. అంతేగాక వీరిని అనుమానపు దృక్కులతో చూడడం జరిగేది.

**3) అభిప్రాయం వ్యక్తపరిచే స్వేచ్ఛ:** ఈ చట్టంలోని మూడవ సూత్రం ప్రకారం ప్రజలకు తమ అభిప్రాయాలను స్వేచ్ఛగా వెల్లడి చేసే అధికారం ఉంటుంది. మంచిని పెంచడం, చెడులను నిరోధించడం విశ్వాసుల హక్కు మాత్రమే కాకుండా అది వారి విధి కూడా అంటోందీ చట్టం. ప్రజలు తమ అంతర్యం లోని అభిప్రాయాలను నిర్భయంగా, స్వేచ్ఛగా వెల్లడి చేయడం పైన్నే ఇస్లామీయ సమాజం, ఇస్లామీయ ప్రజాస్వామ్య వ్యవస్థ సన్మార్గంపై నడవగలుగు తుంది. ఈవిధమైన అభిప్రాయ స్వేచ్ఛ ఉన్నప్పుడే పాలకుడు ఎంతటి గొప్పవాడైనా, తప్పుడు పనులకు పాల్పడినప్పుడు ప్రజలు అతడ్ని నిర్భయంగా నిలదీయు గలుగుతారు; నిర్మొహమాటంగా నిజాన్ని చాటగలుగుతారు.

ఖలీఫాల కాలంలో ప్రజల హక్కులు సురక్షితంగా ఉండడమే కాకుండా వారి హక్కుల్ని పరిరక్షించడం కూడా ఖలీఫాలు తమ విధిగా భావించే వారు. కేవలం సలహాసంఘం సభ్యులకే కాకుండా ప్రతి ఒక్కరికీ తమ ప్రతి

నిధుల్ని, పాలకుల్ని ప్రశ్నించే స్వేచ్ఛ, అధికారం ఉండేది. ప్రజలకు లభించిన ఈ హక్కు, అధికారాలు పాలకులు ప్రసాదించినవి కావు వారి దయాదాక్షిణ్యాల కోసం ఎదురుచూడడానికి. ఇది ఇస్లామీయ రాజ్యాంగం ప్రజలకు ప్రసాదించిన చట్టపరమైన ప్రాథమిక హక్కు. ఈ హక్కుల్ని గౌరవించడం నాటి పాలకులు తమ విధిగా భావించేవారు. ఈ హక్కుల్ని మంచి కోసం వినియోగించడం దేవుని తరఫున, ఆయన ప్రవక్త తరఫున ప్రజలపై విధించబడిన గురుతర బాధ్యత. వీటిని నెరవేరుస్తూ, రాజ్యంలో సమాజంలో చక్కని సుహృద్భావ వాతావరణాన్ని కల్పించడం ఖిలాఫత్ బాధ్యతల్లో ప్రముఖ అంశం.

కాని, రాచరిక పాలన ప్రారంభమవుతూనే ప్రజల హృదయాలకు తాళం వేసి, వారి నోళ్ళు నొక్కేయడం జరిగింది. ఇక నోరు విప్పితే భట్రాజుల్లా పొగడాలి, లేకపోతే నోరుమూసుకొని పడిఉండాలి. అంతేగాని అన్యాయాన్ని సహించేదిలేదని అధికారాన్ని ప్రశ్నిస్తే మాత్రం జీవిత ఖైదుకో, మరణశిక్షకో సిద్ధపడాల్సి ఉంటుంది. దీనివల్ల నాటి ముస్లిములు క్రమక్రమంగా అధైర్యం, భయాందోళనలకు గురవుతూ, 'మనకెందుకులే' అనే స్థితికి లోనయ్యారు. నిజం మాట్లాడి ముప్పును కొనుక్కొనేవారు దాదాపు కనుమరుగయ్యారు. అడుగులకు మడుగులొత్తుతూ ముఖస్తుతి చేసేవారికి మార్కెట్‌లో మంచి గిరాకీ ఉండేది. మంచివాళ్ళకు, న్యాయంగా మాట్లాడేవాళ్ళకు విలువ లేకుండాపోయింది. సమర్థులు, అర్హులైన విశ్వాసులు, స్వేచ్ఛాప్రియులు ప్రభుత్వంతో సంబంధం లేకుండా ఉండిపొయ్యారు. ఇక ప్రజల పరిస్థితి ఎలా తయారైందంటే, ఒక మంచి ప్రభుత్వాన్ని నిలబెట్టుకుందామనే స్పృహకూడా వారికి లేకపోయింది. ఎవరొస్తే మన కొరిగేదేముందిలే అనే ఉదాసీనత ఆవరించి ప్రభుత్వ మార్పులు, చేర్పులను కేవలం ప్రేక్షకుల్లా చూస్తూ ఉండిపొయ్యారు.

**4) దైవానికి, ప్రజలకూ జవాబుదారీ:** పై విషయాలతోనే సంబంధం

కలిగిఉన్న ఈ చట్టంలోని నాల్గవ సూత్రం ప్రకారం పాలకులు, ప్రభుత్వం, తమ పరిపాలన గురించి అటు దైవానికి, ఇటు ప్రజలకు జవాబుదారులుగా ఉండాలి. దైవం ముందు సమాధానం చెప్పుకోవాలన్న భావనతో సన్మార్గ గాములయిన తొలి నలుగురు ఖలీఫాలు పగలు శాంతికి, రాత్రి నిద్రకు దూర మయ్యేవారు. అనుక్షణం దైవానికి భయపడుతూ ప్రజాసేవలో ఎలాంటి లోటు రానివ్వకుండా ఎంతో బాధ్యతతో మసలుకొనేవారు. ఇక ప్రజలకు సమా ధానం చెప్పుకొనే విషయంలోనైతే, ఎప్పుడైనా, ఎక్కడైనా తాము ప్రజలకు జవాబుదారులమని భావించేవారు. కేవలం సలహామండలికే (పార్లమెంటు) నోటీసు జారీచేసి వారి నుండే సమాధానాలు రాబట్టాలనేది వారి విధానమే అయి ఉండేదికాదు. ప్రతిరోజు ఐదుపూటల నమాజులో వారు ప్రజలను కలుసుకునేవారు. వారానికోసారి ప్రతి శుక్రవారం ప్రజలందరినీ సమావేశపరచి ప్రజల కష్టసుఖాలను విచారించేవారు. హితవులు గరిపేవారు, అవసరాలు తీర్చేవారు. బాడీగార్డులు, అదనపు భద్రతా బలగాలు లేకుండానే, లాఠీచార్జీలు, ట్రాఫిక్ జామ్‌లు లేకుండానే వీధుల్లో తిరిగి ప్రజలను కలుసుకునేవారు. వారి కార్యాలయాలు, రాజభవనాలు ప్రజల కోసం ఎప్పుడూ తెరుచుకునే ఉండేవి. ఎలాంటి పడిగాపులు, రికమండేషన్లు, అపాయింట్‌మెంట్లు లేకుండానే ప్రతి ఒక్కరూ ఎప్పుడు పడితే అప్పుడు వారిని కలుసుకునేవారు. ఈ సందర్భాలన్ని టిలోనూ ప్రతి ఒక్కరూ పాలకులను, అధికారులను ప్రశ్నించి సమాధానాలు రాబట్టేవారు. ఈనాటి ప్రజాదర్బార్లకు మల్లే అవి పరిమితమైన కంటి తుడుపు కార్యక్రమాలు కావు. ఎవరి రికమండేషన్ లేకుండానే ఎవరైనా ఎప్పుడైనా పాలకులను కలుసుకునే, ప్రశ్నించే అధికారం ఉండేది. ఎందుకంటే వీరు ప్రజల చేత, ప్రజల అభిప్రాయాలతో అధికారం చేపట్టినవారు కావడం వల్ల ప్రజల్ని కలుసుకోవడంలో వారికెలాంటి ఇబ్బందులూ ఉండేవికావు. అధి

కారాన్ని అంటిపెట్టుకోవాలనే ఆశ, అధికారం పోతుందనే బెంగ వారికి ఏమాత్రం ఉండేవికావు. ప్రజలు ఎంతో నమ్మకంతో తమకప్పగించిన అధికారాన్ని ఎంతో బాధ్యతతో, జవాబుదారీతనంతో వారు నిర్వర్తించేవారు.

కాని, రాచరిక పాలన రాగానే 'జవాబుదారీ పాలనా' భావన అటకెక్కింది. 'దైవం ముందు సమాధానం' అనే భావన నాలుకలపై నానుతున్నప్పటికీ, ఆచరణలో మాత్రం అది అంతంతమాత్రం కూడా కానరాలేదు. ఇక ప్రజలకు జవాబుదారీ అనే భావనకు అర్థమేలేదు. రాజుల ముందు నోరు తెరిచే సాహసం, దమ్ములు ఎవరికీ ఉండేవికావు. వాళ్ళు జాతిని జయించిన వాళ్లాయే. బానిసలకు ఏ విజయుడు జవాబుదారీగా ఉంటాడు? వారు తమ కండబలంతో అధికారంలోకి వచ్చినవారు. దమ్మున్నవాళ్ళు మా నుండి అధికారం లాక్కోమని తొడ చరచి సవాల్ చేసేవారు. ఇలాంటి వారు ప్రజలకు సమాధానం చెబుతారా? ప్రజలు వారి వద్దకెళ్ళడానికి సాహసిస్తారా? వీరు కాలు బయటపెడితే పటిష్టమైన రక్షణ వలయంలో మాత్రమే బయలుదేరేవారు. వెనుకాముందు డజన్లకొద్ది వాహనాలు, వందల సంఖ్యలో భద్రతాదళాలు కిలోమీటర్ల పొడవునా రోడ్లు ఖాళీ చేసి మరీ అనుసరించేవి. ఇలాంటి స్థితిలో ప్రజలు వీరిని సమీపించడం అసంభవం.

**5) ప్రభుత్వ ధనాగారం- ఒక అమానతు**: ఇస్లామీయ శాసనంలోని ఐదవ అంశం ఏమిటంటే, బైతుల్ మాల్ (ప్రభుత్వ ధనాగారం) దేవుని సొత్తు, దైవవిశ్వాసుల అమానతు. ప్రభుత్వ ధనాగారంలోకి వచ్చే ప్రతి వస్తువు, ప్రతి పైసా ధర్మసమ్మతమైన మార్గం ద్వారా తప్ప మరే మార్గానా రావడానికి వీల్లేదు. అలాగే ఈ ధనం ధర్మసమ్మతమైన మార్గాన తప్ప మరే మార్గాన ఖర్చుకావడానికి వీల్లేదు. పవిత్ర ఖుర్ఆన్ ప్రకారం ఈ ధనంలో పాలకుల హక్కు, ఒక అనాథ సొమ్ములో అతడి సంరక్షకుడికి ఉన్నంత హక్కుగా మాత్రమే ఉంటుంది. *'మన్‌కాన గనియ్యన్ ఫల్‌యస్ తాఫిఫు వమన్ కాన ఫఖీరన్ ఫల్*

**యాకుల్ బిల్ మారూఫ్'** (ఎవరైతే తన అవసరాలకు సరిపడేట్లు సంపాదించు కుంటున్నాడో, అతడు ఈ ధనం నుండి వేతనం తీసుకోడానికి సిగ్గుపడాలి. ఎవరైతే నిజంగానే అవసరార్థుడో అతడు మాత్రం ప్రజలంతా 'న్యాయమే' అనేవిధంగా వేతనం తీసుకోవచ్చు) పాలకుడు ప్రభుత్వ ధనాగారం నుండి ఖర్చుపెట్టే ప్రతి పైసాకు జవాబుదారుడు. ప్రతి పైసాకు లెక్కలు చూపమని అడిగే సంపూర్ణహక్కు ప్రజలకు ఉంది.

ఖులఫాయె రాషిదీన్‌లు (సన్మార్గగాములైన ఖలీఫాలు) ఈ సూత్రాన్ని పూర్తిగా పాటించి తమ నిజాయితీని నిరూపించుకున్నారు. వారి ధనాగారంలోకి వచ్చే ప్రతి పైసా ధర్మసమ్మతమైన ఇస్లామీయ విధానాల ద్వారానే వచ్చేది. ఖర్చయ్యే ప్రతిపైసా కూడా పూర్తిగా ధర్మసమ్మతంగా ఖర్చయ్యేది. కొంతమంది ధనవంతులైన పాలకులైతే కనీసం ఒక్క రూపాయి కూడా వేతనంగా తీసుకో కుండా ప్రజాసేవకే అంకితమయ్యారు. జీవితాంతం ప్రజాసేవకే అంకితమైన కొంతమంది తమ అవసరాల కోసం చాలా తక్కువ వేతనం తీసుకునేవారు. ఇంత తక్కువ వేతనంతో కుటుంబం ఎలా గడుస్తుందని ప్రజలు ఆశ్చర్య పొయ్యేవారు. చివరికి శతృవులు సైతం వారి న్యాయశీలతకు, త్యాగనిరతికి ఆశ్చర్యపోయేవారు. ప్రతి ఒక్కరికీ లెక్కలు చెప్పడానికి వారు సదా సిద్ధంగా ఉండేవారు. నిండుసభలో ఒక అనామకుడు 'మీకు ఇంత పెద్దచొక్కా కుట్టించు కోడానికి గుడ్డ ఎక్కడినుండి వచ్చింది?' అని ప్రశ్నించేవాడు.

కాని ఈ ఖిలాఫత్ వ్యవస్థ రాచరిక వ్యవస్థగా మారిన తర్వాత ప్రజల నుండి సమీకరించిన ప్రభుత్వ ధనం రాజు సొత్తయిపోయింది. ధర్మం అధర్మం అనే తేడా లేకుండా ఎలాపడితే అలా ధనం వచ్చేది. ధర్మాధర్మాల ప్రసక్తి లేకుండానే మంచినీళ్ళ ప్రాయంగా ఆ ధనం దుబారా అయిపొయ్యేది. లెక్కా పత్రాలు అడిగే ధైర్యం ఎవరికీ ఉండేది కాదు. దేశాన్ని వర్థించిన విస్తరిలా

భావించి వీధి స్థాయి మొదలు రాజధాని స్థాయి లీడరు వరకు ఎక్కడబడితే అక్కడ అందినకాడికి దండుకునేవారు. ఎవరికీ సమాధానం చెప్పే అవసరమే లేదన్నట్లు ప్రజాధనాన్ని తేరగా ఆరగించి బ్రేవ్‌మని తేన్చేవారు.

**6) చట్టపాలన:** ఆరవ సూత్రం ప్రకారం రాజ్యంలో చట్టపాలన సాగాలి. (దైవం, దైవప్రవక్తల చట్టం) చట్టానికి ఎవరూ అతీతులుగా ఉండరాదు. చట్టాన్ని అతిక్రమించే హక్కు, అధికారం ఎవరికీ ఉండడానికి వీల్లేదు. ఒక సాధారణ పౌరుడు మొదలు ప్రభుత్వాధినేత వరకు అందరికీ ఒకే విధమైన చట్టం వర్తించాలి. చట్టం అందరిపై ఒకే విధంగా అమలు జరగాలి. న్యాయం విషయంలో అందరి పట్లా ఒకే తీరుగా వ్యవహరించాలి. పేదవాడని నిర్లక్ష్యం, ఉన్నవాడని శ్రద్ధ చూపడానికి వీల్లేదు. న్యాయస్థానాలకు సంపూర్ణ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు ఉండాలి. న్యాయస్థానాలపై ఏ స్థాయిలోనైనా ఎలాంటి ఒత్తిడులు ఉండకూడదు. ఖులఫాయె రాషిదీన్ ఈ విషయంలో కూడా చక్కని ఆదర్శం నిలబెట్టారు. చక్రవర్తులకంటే ఎక్కువ అధికారాలు కలిగి ఉన్నప్పటికీ వీరు తమనుతాము దేవుని చట్ట సంకెళ్ళలో బందీలుగా జీవించేవారు. వారి స్నేహం, బంధుత్వాలు చట్టాలకు వ్యతిరేకంగా ఎవరికీ లబ్ది చేకూర్చేవికావు. వారి శతృత్వం చట్టానికి వ్యతిరేకంగా ఎవరినీ నష్టపరచగలిగేవి కూడా కావు. ఒక సాధారణ వ్యక్తి కూడా వారిపై న్యాయస్థానానికి ఫిర్యాదు చేస్తే, ఓ సాధారణ మనిషిలాగానే వారు న్యాయస్థానాన్ని ఆశ్రయించేవారు. ఇదేవిధంగా వారు తమ గవర్నర్లు, సైన్యాధికారుల్ని కూడా చట్టానికి లోబడి పని చేయవలసిందిగా ఆదేశాలు జారీ చేసేవారు. న్యాయమూర్తుల్ని ప్రభావితం చేసే సాహసానికి కూడా ఎవరూ పాల్పడేవారు కాదు. సాక్షుల్ని తారుమారు చేసి చట్టం పట్టు నుండి తప్పించుకోవడం కూడా ఎవరికీ సాధ్యమయ్యేది కాదు.

కాని, ఖిలాఫత్ రాచరికంగా రంగు మార్చుకోగానే ఈ నైతిక సూత్రాలన్నీ తుంగలో తొక్కబడ్డాయి. రాజులు, యువరాజులు, సేనాపతులు, అధి

కారులు, నాయకులే కాకుండా రాజవంశం రంగు పూసుకున్న ప్రతి ఒక్కరూ చట్టానికి అతీతులుగా ఎంచబడ్డారు. ప్రజల ధన ప్రాణాలు సర్వస్వం వారికి ధర్మసమ్మతమై పొయ్యాయి. బలవంతుడికో న్యాయం, బలహీనుడికో న్యాయంగా 'న్యాయం' అనేది రెండుగా చీలిపోయింది. నిష్పక్షపాతంగా తీర్పులు చెప్పే న్యాయమూర్తులపై ఒత్తిడి తేవడం, నయానా భయానా వారు మాట వినకపోతే వారికి ఉద్వాసన పలికి తమకు అనుకూలురైన తొత్తుల్ని న్యాయ స్థానం పీఠాలపై అధిష్ఠించడం జరిగింది. దైవభీతిపరులైన కొంతమంది నిజాయితీపరులైన న్యాయమూర్తులు న్యాయపీఠాలపై కూర్చోడానికి బదులు కొరడా దెబ్బలు తినడానికి, జైలుకు వెళ్ళడానికే ప్రాధాన్యతనిచ్చారు. పాలకుల అభీష్టాలకనుగుణంగా న్యాయానికి తిలోదకాలిచ్చి దైవశిక్షను కొనుక్కోవడానికి వారు సిద్ధపడలేదు.

**7) హక్కులు, ప్రాధాన్యతల ఆధారంగా సంపూర్ణ సమానత్వం:** ప్రజలకు తమ తమ హక్కులు, ప్రాధాన్యతల ప్రకారం సంపూర్ణ సమానత్వం లభించాలనేది ఇస్లామీయ శాసనంలోని ఏడవసూత్రం. నాటి ఇస్లామీయ రాజ్యంలో దీన్ని చాలా పటిష్టంగా, సమర్థవంతంగా అమలు చేయడం జరిగింది. ముస్లింల మధ్య దేశం, వంశం, వర్ణం, భాషలాంటి తారతమ్యాలు ఉండేవికావు. జాతి, తెగ, ప్రాంతం, కుటుంబాల ప్రాతిపదికన ఎవరకీ ఎవరిపై ఎలాంటి ప్రత్యేకతలు ఉండేవికావు. దైవాన్ని, దైవ ప్రవక్తను విశ్వసించే ప్రజలందరి హక్కులు ఒకేవిధంగా, సమానంగా ఉండేవి. ఒకవేళ ఒకరిపై మరొకరికేమైనా ప్రత్యేకతలు ఉన్నాయంటే, కేవలం వారివారి సమర్థత, సచ్ఛరిత, నైతికత, దైవభీతి, ప్రజాసేవ ఆధారంగా మాత్రమే ఉండేవి. కాని ప్రజా ప్రాతినిధ్యం స్థానంలో రాచరిక వ్యవస్థ ప్రాణం పోసుకున్నప్పుడు జాతి, కులం, మతం అనే పైశాచికుడు కోరలు చూపుతూ ముందుకొచ్చాడు. రాజ వంశం రాజకుటుంబాల స్థాయి, అంతస్తు అందరికంటే ఎక్కువగా పెరిగి పొయ్యాయి. రాజకుటుంబ తెగలకు ఇతర తెగలపై హక్కు అధికారాలు

ప్రాప్తమయ్యాయి. అరబ్బు, అరబ్బేతరులన్న జాతి వివక్ష పుట్టు కొచ్చింది. స్వయంగా అరబ్బుల్లో కూడా అంతర్విభేదాలు ప్రారంభ మయ్యాయి. ఇస్లామీయ సమాజానికి ఇది ఎంతటి నష్టం కలగజేసిందో చరిత్రపుటలే సాక్ష్యం పలుకుతున్నాయి.

## ఇమామె హుసైన్ (ర) త్యాగం, విశ్వాస గుణ సంపన్నత

ఇవి ఇస్లామీయ ఖిలాఫత్ వ్యవస్థను కుటుంబ రాచరికంలోకి మార్చడం వల్ల సంభవించిన వైరుధ్యాలు. యజీద్ రాచరిక పాలన ద్వారానే ఈ వైరుధ్యాలు పొడసూపాయనే చారిత్రక వాస్తవాన్ని ఎవరూ నిరాకరించలేరు. ఈవిధంగా ప్రారంభమైన ఈ వైరుధ్యాల కారణంగా అతికొద్ది కాలంలోనే పైన పేర్కొన్న చెడులన్నీ రాచరిక వ్యవస్థలో ప్రస్ఫుటమయ్యాయి. ఎప్పుడైతే ఈ మార్పులు ప్రారంభమయ్యాయో, అప్పుడు వెంటనే ఈ రుగ్మత లన్నీ ముందుకు రాకపోయినప్పటికీ, రాజ్యం, రాజకీయ వ్యవస్థలను ఇస్లాం సంస్క రించిన విధానాలకు ముందు ముందు తీవ్ర విఘాతం ఏర్పడుతుందనే విషయాన్ని దూరదృష్టి కలిగిన ప్రతి ఒక్కరూ ఇట్టే అర్థం చేసుకోగలిగారు.

అందుకే ఇమామె హుసైన్ (రజి) ఈ రాచరిక వ్యవస్థను ఎంతమాత్రం సమర్థించలేకపొయ్యారు. ఎలాంటి పరిణామాలు ఎదుర్కోవాల్సిన వచ్చినా, ఎంతటి ప్రమాదాలను ఆహ్వానించాల్సి వచ్చినా వెనకాడ కూడదనే నిర్ణయానికే ఆయన కట్టుబడ్డారు. ఇమామ్ ప్రాణాలకు సైతం తెగించి, ప్రజావ్యతిరేక రాచరిక వ్యవస్థను ఎదుర్కొన్న క్రమంలో సంభవించిన పరిణామ ఫలితాలు ఈనాడు అందరిముందున్నాయి. ఇమామె హుసైన్ (రజి) ఇంతటి పెను ప్రమా దాన్ని కూడా ఖాతరు చేయకుండా, వీరోచితంగా పోరాడి, ఇస్లామీయ సంక్షేమ రాజ్యం యొక్క మౌలిక ప్రత్యేకతల్ని కాపాడుకోడానికి ఒక విశ్వాసి తన సర్వ స్వాన్నీ ధారపోయాలని ఆచరణాత్మకంగా నిరూపించారు. ఈ లక్ష్య సాధనలో ఒక ముస్లిం తననూ, తన కుటుంబాన్ని, తన పరివారాన్ని ఏవిధంగా త్యాగం

చేయగలడో ఇమాం జీవితం మనకొక సజీవ ఆదర్శం. ప్రజాసంక్షేమానికి పట్టు గొమ్మలు అనదగ్గ పై ఏడు మూల సూత్రాలకు వ్యతిరేకంగా తలెత్తే అన్ని వైరుధ్యాలను సమూలంగా నిర్మూలించడానికి ఒక విశ్వాసి తన సర్వస్వాన్ని ధార పోయడానికి సదా సిద్ధంగా ఉండాలి. ఎవరైనా ఈ పవిత్ర కార్యాన్ని 'రాజకీయం' అంటే అనవచ్చుగాని, హజ్రత్ అలీ(రజి), హజ్రత్ ఫాతిమా గార్ల సుపుత్రుడు, దైవప్రవక్త ముహమ్మద్ (సఅసం) వారి ముద్దుల మనవడు హజ్రత్ ఇమామె హుసైన్ (రజి) దృష్టిలో మాత్రం ఇదొక పవిత్రమైన ధర్మ కార్యం. అందుకే ఆ మహనీయుడు ఈ ధర్మకార్యంలో ప్రాణత్యాగాన్ని 'షహాదత్' (అమరత్వం)గా భావించి ప్రాణాలర్పించారు.



అల్లాహ్ - ఆయన తప్ప ఆరాధ్య దైవం ఎవ్వడూ లేడు. సకల చరాచర సృష్టికి మూలాధారం అయిన ఆయన సజీవుడు, నిత్యుడు, అనంతుడు. ఆయన నిదురపోడు, ఆయనకు కునుకూ రాదు. భూమ్యాకాశాలలో ఉన్న సమస్తమూ ఆయనదే.
(దివ్యఖుర్ఆన్-2:255)




తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్

సందేశభవనం, లక్కడ్‌కోట్, హైదరాబాద్-500 002.

ఫోన్: 24564583

Website: www.teluguislamiclit.org

e-mail: tiphyderabad@rediffmail.com